శ్రీమత్పరమేశ్వరాయనమః.

# ద్వారక వేంకటేశ్వర శతకము.

ఇది

మంత్రులు నరసింహకవిగారిచే విరచితమై

అమలాపురం, శ్రీదేవిశెట్టి బసవన్నగారు వ్రాసిన ప్రతినిబట్టి

ఏలూరు, కొండగుంటూరి నాగభూషణకవిగారిచే

తిరిగి వ్రాయంబడి,

శ్రీయుత కొండూరి నారాయణరావు, గరిగె మాణిక్యంగార్ల

ద్రవ్యసహాయంబున

ఏలూరు,

రామా ముద్రాక్షరశాలయందచ్చు వేయించబడి,

ప్రకటింపంబడియె.

ప్రథమకూర్పు ౧౦౦౦ ప్రతులు.



శ్రీమత్పరమేశ్వరాయనమః.

# ద్వారక వేంకటేశ్వర శతకము

:o:

ఉ. శ్రీలలనేశ మీకృప ర ♦ చించెద మామకవాక్ప్రసూనముల్
మాలికగా నొనర్చియు స ♦ మర్పణ జేసెద మీకు సత్యవా
వాలిన సత్కవీంద్రులను ♦ సారెకు సన్నుతులాచరించెదన్
పాలితభక్త దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా.

ఉ. పెట్టెద నూర్ధ్వపుండ్రములు ♦ ప్రీతిగ మీపదపద్మయుగ్మముల్
బెట్టెద సత్ప్రణామములు ♦ బాయుటకై మొనరింతు నీస్మృతిన్
మట్టెద నాదుపాపములు ♦ మాన్పుటకై యమకింకరాదులన్
గొట్టెద ముక్తికాంతగను ♦ కోరుకు ద్వారక వేంకటేశ్వరా.

ఉ. మంత్రినిలాన్వితంస నృప ♦ మాన్యుడ కాశ్యపగోత్రపౌత్ర స్వా
తంత్రుడ కామయగాత్మజుడ ♦ నెన్నమతిన్ నరసింహయాఖ్యుడన్
మంత్రము లేమియున్నెఱుగ ♦ మత్పుడ తావక నామకీర్తనల్
మంత్రముగా బఠించెదను ♦ మానక ద్వారక వేంకటేశ్వరా.

ఉ. జ్ఞానము లేనిజీవి నిఘ ♦ నతెనాయుంగని యీవి రాజస

చం. జలములు లేని యేరు బుధ ♦ సత్తములుండని యూరు సత్యముల్
బలుకని నోరు సస్యముల ♦ ప్రబలహించని నీరు సారెకున్
కులసతి తోటి పోరు పటు ♦ కోవెల లేని వనంబు సౌరు నిన్
దలపని వారు ధారుణి వృ ♦ ధాయగు ద్వారక వేంకటేశ్వరా. ౫

చ. చిరిగిన చొక్క వాసనలు ♦ జెందని బుక్క నిరర్థకంబుగా
మొరిగిన కుక్క త్రాత తుద ♦ ముట్టని లెక్క మెరుంగు నిప్పులం
గరగని లక్క చాలనప ♦ కత్తికి లొంగని పోకచెక్క బల్
మురిగిన తోలుపక్క తుద ♦ ముట్టదు ద్వారక వేంకటేశ్వరా. ౬

ఉ. కూరిమి లేని యాలు సమ ♦ కూడని ముత్యసరాలు పాపసం
చారికి జేయు మేలు బుధ ♦ సత్తములుండని ప్రోలు నీటిపై
జేరిన వ్రాలు వాసనలు ♦ జెందని పూలు నిరర్థకంబయా
వారిజనాభ దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౭

చ. పిలువని విందు చాలవల ♦ పించని యింతుల పొందు రోగముల్
దెలియని మందు రచ్చల ను ♦ తించని విద్య పసందు సస్యముల్
మొలవని క్రిందు భక్తి నిను ♦ బూజలు సేయని చిత్తమెందుకో
జలజదళాక్ష యోగమువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౮

ఉ. ధర్మము లేని విత్తమును ♦ దైవవశంబునగాని యత్నమున్
దుర్మతి సేయు దత్తమును ♦ దుర్జన సంగతి గూడు చిత్తమున్
ఓర్మియు లేని సత్త్వమును ♦ యుత్తమ జాతియు గాని రత్నమున్
గూర్మియు లేని పత్నియును ♦ గూడదు ద్వారక వేంకటేశ్వరా. ౯

ఉ. దాతకులోభికీడు వసు ♦ ధాధిపునొద్దను చాడికీడు దు
ర్జాతిని నమ్మకీడు పని ♦ సల్పని బానిసకీడు యూరిలో

ఘాతకుడున్న కీడు రసి ♦ కత్వమెరుంగని యీవికీడయా
పాతక నాశభక్తజన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౧౦

ఉ. పాతకులున్న చోట బహు ♦ బాధలుగల్గినచోటసంతత
ఖ్యాతియు లేనిచోట మ ♦ ర్యాదలెరుంగనిచోట సత్యసం
ఘాతము లేనిచోట ఘల ♦ ఘాతకులుండెడుచోట సాధులే
రీతినినిల్తురో నరహ ♦ రీహరి ద్వారక వేంకటేశ్వరా. ౧౧

చ. పరసతితోటికూరిమియు ♦ బాంధవవర్గముతోటి వైరమున్
గురువులతోటిబేరమును ♦ గ్రామరులతోటివిచారముస్ హరి
స్మరణులతోటిబీరమును ♦ సజ్జనులెప్పుడు సల్పరాదయా
సరసిజనాభయాగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౨

ఉ. సత్యముదప్పుచోట జన ♦ సమ్మతిదప్పినచోట సాధునాం
గత్యము లేనిచోట తన ♦ కాంక్షలెరుంగనిచోట బంధుసా
హిత్యము లేనిచోట ఋణ ♦ మివ్వగజాలనిచోట నెప్పుడున్
నిత్యమునిల్వరాదు యిది ♦ నిక్కము ద్వారక వేంకటేశ్వరా. ౧౩

చం. కలగనిమేలుచాలనిసి ♦ ఘాలుసుగంధము లేనిపూలు పి
క్కలజవ లేనిమేలు తుర ♦ గాలు మృదుత్వము లేనిస్త్రీలు దా
వలువనియాలు బూరుగ ♦ లాలు దలంప నిరర్థకంబయా
జలజదళాక్ష యాగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౪

ఉ. హీనునితో నుదారగుణ ♦ హీనునితో గులహీనుతోదయా
హీనునితో బుధానుమతి ♦ హీనునితోగుణ హీనుతో సదా
దానవిహీనుతో సకల ♦ ధర్మవిహీనుతో మానహీనుతో
హానిసుమీ జరింపగ జ ♦ నావన ద్వారక వేంకటేశ్వరా. ౧౫

ఉ. దూరమునున్న గర్వమున ♦ దూగుచునున్న జలాంతరంబునం
దూరుచునున్న గోపమున ♦ దూలుచునున్న సశూచినున్న సం
స్కారము జేయుచున్న తరు ♦ శాఖలనున్న బుధాళికిన్నమ
స్కారము జేయరాదు సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౬

ఉ. ఏలినవానితో తనువ ♦ రించనియింతితో బ్రజ్వలాగ్నితో
బాలులతో దురంత మగు ♦ పాములతో దన యాయుధంబుతో
గూళులతో విరోధులను ♦ గూడినవారితో యాచకాళితో
జాలయతీంద్రుతోటి సర ♦ సంబులు గూడవు వేంకటేశ్వరా. ౧౭

ఉ. ఇవ్వకకీర్తిలేదు వల ♦ పించక నింతికియింపులేదు య
ప్పివ్వకవాదు రాదు కల ♦ హించిన వైరుల సంగరస్థలిన్
రువ్వక వాడిలేదు ఘర ♦ లో కొడుకబ్బక ముక్తిలేదయా
ఎవ్వరికైన పద్ధతి బు ♦ ధేశ్వర ద్వారక వేంకటేశ్వరా. ౧౮

ఉ. యిల్లుసుమీ ఘనాయుషము ♦ యిల్లుసుమీ గుణాకారముంగసం
గల్లసుమీ సతీసతులు ♦ గాదుసుమీ దుహితాత్మ మైత్రియున్
దల్లిసుమీ దలంప దన ♦ దైవము వారలకెల్ల శ్రీమనో
వల్లభ నీవెదిక్కు ముని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౧౯

చ. పరిమళహీనసూనము ♦ ప్రాజ్ఞులు మెచ్చనివిద్య కామినీ
విరహితమైనగేహ మర ♦ విందవిహీన సరోవరంబు కా
పురుషుని సేవనంబు శివ ♦ పూజలొనర్చని చేతులున్ సుధా
వరపరశూన్యమాస భలు ♦ వ్యర్థము ద్వారక వేంకటేశ్వరా. ౨౦

ఉ. వంచెడువానినింగవిని ♦ వైద్యుని మంత్రిని మంత్రవాదినిం
గొండెముజెప్పువాని నృపు - గూడినవాని మహాఘనీకునిన్

మండలమేలువాని దన ♦ మర్మమెఱింగిన వారితోడనే
ఖండితమాడరాదు కొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా.

ఉ. కారములేనికూర యుప ♦ కారములేని మనుష్యుఁడాది యోం
కారములేనిమంత్రి మఘ ♦ కారములేని ప్రతిజ్ఞ వాక్చమ
త్కారములేని వేశ్యగుణ ♦ కారములేనటువంటిలెక్క శ్రీ
కారములేని వ్రాతకొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౨౨

చ. కుదురుగలేనిబుట్ట యతి ♦ కూర్మివహించని చెట్టహెచ్చుగా
నుదకములేనికట్ట తఱి ♦ వచ్చిన మొల్వని విత్తుగట్ట పై
సదనములేనిమెట్టస ♦ జాలనిబట్టని రగ్ధకంబయా
సదమలనీలదేహ సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౩

ఉ. కారములేనియుప్పు సగ ♦ పాలికి జేసినమెప్పు సుందరా
కారములేని కొప్పు కల ♦ కాలము వేయని పుష్పకప్పు సం
సారికి నిస్వసప్పు జన ♦ సమ్మతిదప్పిన మొప్పుగూరలో
గారములేని చొప్పు కొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౨౪

ఉ. స్నానమదేల గద్దరును ♦ సంధ్యజపంబులు జ్ఞానికేల స్వ
స్థానమదేల యోగికిని ♦ సంపదయేల నపుత్రవంతుకున్
మానమదేల హీనునకు ♦ మన్ననలేల వితంతుజాణకున్
దీనశరణ్య గణ్య జగ ♦ దీశ్వర ద్వారక వేంకటేశ్వరా. ౨౫

ఉ. సత్తువలేని పోటు దన ♦ సత్వమెఱుంగని దాటు చేతిలో
బత్తెములేనిపాటు ధర ♦ పాటియెఱుంగని విత్తునాటు సం
పత్తియులేనినీటు నిజ ♦ పత్నిగలేని గృహంబుదీటుసా
రిత్తగదయ్య శ్రీనరహ ♦ రీహరి ద్వారక వేంకటేశ్వరా. ౨౬

ఉ. వానలులేనిపైరు బల ♦ వంతునిగల్వని వారు పౌరుష
జ్ఞానములేనివారు ప్రభు ♦ సమ్మతిలేని ప్రధానితీరు స్వ
స్థానములేనివారు నవు ♦ దార్యములేని గుణంబువారు స్వా
ధీనములేని యూరు కడ ♦ తేరదు ద్వారక వేంకటేశ్వరా. ౨౭

చ. సరసమువంటిరీతి కడు ♦ సత్యవచస్స్మృతివంటినీతిభూ
సుర మతివంటిజాతి పరి ♦ శోభిత వజ్రమువంటి హేతి యా
దరసమువంటిభూతి వసు ♦ ధన్ సరిలేదుగదయ్య అయ్యయో
పరమకృపాసముద్ర జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౨౮

ఉ. మానినివంటి సౌఖ్యమును ♦ మానమువంటిధనంబునాత్మ సు
జ్ఞానమువంటి యోగము మ ♦ హాశన దానమువంటి దానమున్
స్నానమువంటి సత్క్రియను ♦ శాంతమువంటి గుణంబు దేవతా
గానమువంటి విద్య మరి ♦ గానము ద్వారక వేంకటేశ్వరా. ౨౯

చ. ఉడకనిపప్పు వర్షికిని ♦ యోగులకిచ్చిన యప్పు పాశికిన్
బెడసిన కొప్పు దుష్టుల క ♦ భీష్టములిచ్చిన మెప్పునోటికిన్
విడియములేని కప్పు గతి ♦ విస్యనితప్పు నిరర్థకంబయా
జడధిశయాన యాగమ వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౩౦

చ. కనుగొనలేనిచూపు దన ♦ కన్నులకింపునుగానిచూపు జ
వ్వనమునులేనియేపు బల ♦ వంతముదప్పిననైపు చంద్ర వ
ర్తనమునులేనిమాపు వర ♦ ధర్మమెరుంగనిప్రాపదేల యో
వనజదళాక్ష యాగమ వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౩౦

ఉ. బేరముటోకునే పరుల ♦ భిక్షములెన్నుటలేకనే బలో
త్కారముమాకనే పసిడి ♦ తాటకుచాయలుకాకనేయలం

కారముకోకనే సకల ♦ కార్యములున్ సమకూడు పోకనే
వారిజనాభ దుష్కృత ని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౩౨

ఉ. మెచ్చనిమాట గాయకులు ♦ మెచ్చనిపాట ప్రభుస్థలంబు లన్
మెచ్చనియాట యాచకులు ♦ మెచ్చనిపేట నృపాలశేఖరుల్
మెచ్చనికోట కీరములు ♦ మెచ్చనితోట నిరర్థకంబయా
అచ్యుతవామనాశ్రిత జ ♦ నావన ద్వారక వేంకటేశ్వరా. ౩౩

చ. తెలియనివానిప్రాలు జగ ♦ తింరణభీరునిచేతివాలు భూ
తలమున లేనిచేలు సతి ♦ దంభునకిచ్చువరాలు జన్మ స
ద్భలితముగానిమేలు బహు ♦ భాధలుగల్గినప్రోలు సీరముల్
గలిగినపాలు యెందుకోర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౩౪

ఉ. వాడినపూలచెండ్లు తగ ♦ వట్టిగనుండనిగుండ్లు రెప్పల
ల్లాడనికండ్లు చాలమధు ♦ రంబుగనుండనిపండ్లు యెప్పుడున్
బాడుగలేనిబండ్లు నినుఁ ♦ బ్రార్థనజేయని నోండ్లు దేలకా
పాడుమునన్ను భక్తజన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా ౩౫

ఉ. హారముర క్తికే సరుల ♦ యాచనసేయుటభుక్తికే యహం
కారముశక్తికే సుకృత ♦ కార్యముజేయుటముక్తికే సదా
చారముసూక్తికే యతివి ♦ చారములెన్నుటయుక్తికే పుర
స్కారముభక్తికే స్మృతివి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౩౬

చ. మదిగలవాడెయోగి బహు ♦ మాన్యతగల్గినవాడెత్యాగి సం
పదగలవాడెభోగి తను ♦ బాధలుబొందినవాడె రోగి యా
పదగలవాడెరాగి నిను ♦ బాడెడువాడెవిరాగి యాజుమీ
సదమల చిత్తయోగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా ౩౭

ఉ. వాసనపూలకే వివిధ ♦ వస్త్రములున్ సమకూరునూలుకే
బాసలుస్త్రీలకే ప్రజల ♦ పాలన జేయుటనాలుకేమనో
ల్లాసముమేలుకే పరుల ♦ రాజ్యముజేరుటబల్మిజాలకే
వాసవవంద్యదుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౩౮

చ. పనిగనలేనిచాన మృదు ♦ వాయువువీవని కాన దారుమ
గ్నసమునులేనిసాన నిర ♦ తంబు సుఖంబులు లేనికూనస
ద్వినయములేని జాణజగ ♦ తిం దెలిబారెడువాన హీనమో
వనజదళాక్షదుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౩౯

ఉ. వైరముబల్మినే పరుల ♦ వశ్యముజేయుటకల్మినే సదా
చారము వేల్మినే జనుల ♦ సమ్మతిజేయుటచెల్మినే తప
స్సారముతాల్మినే పసిడి ♦ చాయలునొందుటమేల్మినే సుమీ
వారిజనాభ దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౪౦

చ. సరసమువాదుకే నిఖిల ♦ సంపదలున్నతిబాధకే కదున్
హరసము సాధుకేబరుల ♦ హాస్యము సేయవివాదకే ధనా
కరషణవేధకే సకల ♦ కావ్యములెన్నుటగాధకే సుమీ
సరసిజనాభయాగమవి ♦ వారకద్వారక వేంకటేశ్వరా. ౪౧

చ. వ్రతములు దారుకే మదిని ♦ హారంభలుదీరుట కోరకే మహా
మితములు మేలుకే పరుల ♦ మోహానగూర్చుట పేరుకే యసం
స్కృతములు నేరకే ధరన ♦ న్యాయమొనర్చుట నోర్వకే నయా
నతతగుణానుతిస్మృతివి ♦ వారక ద్వారక వెంకటేశ్వరా. ౪౨

చ. కొలుచుటలేక నేయడుగ ♦ కోపముసేయుట నివ్వలేక నే
చెలువము కోకనేపగుల ♦ శీలము లెన్నుట లోర్వలేక నే

చెలిమియు లోకువేయునుము ♦ చెందుట చాయల నగ్నికాక నే
జలజదళాక్ష యాగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౪౩

ఉ. తైలములేని దీపమును ♦ తత్త్వవిహీనకలాపమున్ తప
శ్శీలములేని రూపము బ్ర ♦ సిద్ధియులేని ప్రతాపమున్ రసో
ద్వేలతలేని కోపమును ♦ గానిగచూడ నిరర్థకంబ యా
పాలితభక్త దుష్కృతవి ♦ దారక ద్వారక వేంకటేశ్వరా. ౪౪

చ. హరుసములేని తిండి కవి ♦ కర్థులకియ్యని మొండి శుభ్రమై
పరగగలేని వెండి ప్రవ ♦ బాధలు బొందదు కొండి లెస్సగా
నిరుసులులేనిబండి మది ♦ కింపుగజాలని పిండి వ్యర్థమో
సరసిజనాభ యాగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౪౫

చ. రసములులేనియుండె పది ♦ లంబుగవాడని బెండె ధాత్రిపై
యవ్వనమ లేనిబండె నిజ ♦ మైకినుపించనినిండె లెస్సగా
జననములేనిపిండె కృపి ♦ సత్త్వవిహీనునిబొండె యేలయో
సవినయకీర్తినాంద్రి సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౪౬

ఉ. అంటగరాని వేడి తరి ♦ యంటనిగోపులపాడి నిప్పుపై
నంటగబట్టపైడి పమ ♦ నంటనిక్కైకుపువాడిహస్తమం
దంటనినాడి ధాత్రిలఘు ♦ వంటని వేడి నిరర్థకంబయో
బంటనుకావవయ్య జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౪౭

ఉ. కూటికిలేని బేరమును ♦ కూరిమిలేని ప్రచారమున్ బ్రదు
ల్మాటలులేని బీరమును ♦ మంత్రములేని తపోవిచారమున్
సాటికిలేని నైరమును ♦ చాలకవాటములేని ద్వారముఙ
వాటముగాదు దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౪౮

ఉ. దారము లేనిబంతి విశ ♦ దంబుగ వ్రాయని బంతియుక్తి బల్కో
త్కారము లేనిదంతి వెలి ♦ గారము లేని సువర్ణ కాంతి యా
ధారము లేనిపొంతి నిను ♦ దల్వగ నిల్వనిభ్రాంతి వ్యర్థమో
వారిజనాభ దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా ౪౯

చ. వెరపగుసంగరంబు వెను ♦ వ్రేలఘటించనియుంగరంబు పై
మెరయని బంగరంబు నడి ♦ మిక్కిలిగా ధరపైనదిద్దిరం
దిరుగని బొంగరంబు జగ ♦ తింగొరగాదుగదయ్య అయ్యయో
పరమకృపాసముద్ర జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౫౦

ఉ. తేజము లేనిచుక్క జగ ♦ తిం దెలిపొందనితిక్క ధాత్రిపై
వాజులు లేనినక్క బల ♦ వంతముగక్కిన పిక్క మిక్కిలిం
యోజము లేనిసొక్కు సమ ♦ యోచితవర్తన లేని యిక్క మేల్
గాజుల పైనలక్క కొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౫౧

ఉ. అంగన లేనిదిండు చతు ♦ రంగబలంబులు లేనిదండు స్త్రీ
సంగతి లేనిమొండు రుచి ♦ సారము దప్పినపండు సంతతో
త్తుంగము లేనితండు తుల ♦ తూపికె కెక్కని గుండు బెండమో
సంగర రంగభీమ సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౫౨

ఉ. ప్రోసని యేలికా సభల ♦ లోదిరుగాడుకూలి కాక్రియల్
గావనుమాలికా పయిని ♦ గప్పగజాలని ప్రేలికా వృథా
తావ్రలమాలికా మగని ♦ తప్పులనెన్నెడు బాలికా జగ
త్పావనమూర్తి దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౫౩

ఉ. మందము లేనిగోడ కొరగ ♦ మాలినమానినవాడ ధాత్రిపై
యందము లేనిమేడ నెల ♦ యంగన సౌఖ్యము లేనిక్రీడ శ్రీ

జైందనిప్రోడ ధాత్రిపై ♦ జెల్లనిమాడ నిరర్థకంబయా
చందనలిప్తదేహ సుని ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౪

ఉ. కాయనిమాను పౌరుషని ♦ కాయముజెందనిమేను బంధనో
పాయములేని బోను నన ♦ పాయము పంటకు రానిచేను వి
శ్రేయములేనిదాను ప్రచ ♦ రింపగజాలనిమౌన దేల కం
జాయతనేత్ర యాగమ ♦ విచారక ద్వారక వేంకటేశ్వరా. ౧౫

చ. కరుణయులేనిమాత పతి ♦ కార్యమొనర్చనిదూత పాకసం
స్మరణములేనిమేత యుప ♦ కారముజేయనిచేత మాటకు
న్నెరిగురిలేనిదాత మది ♦ నెయ్యముదప్పినభ్రాత యేలభా
స్కరకులవార్ధిచంద్ర సుని ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౬

ఉ. భూపినుతా విరోధమును ♦ బూనినవాని తోయాచకాళితో
పావకుతోదురంత మను ♦ పానులతోబర భామతోడుతర్క
జావుకు జేరు నాను సర ♦ సత్యములాడుటగాన కూడదో
శ్రీజరూప గుష్కృతని వారక ద్వారక వేంకటేశ్వరా. ౧౭

ఉ. పారములేనితుష్టి కడు పారభుజింపనిపుష్టి ధర్మ సం
చారములేనిముష్టి ప్రభు సత్వముచాలనిసృష్టి కర్మ సం
స్కారములేనియుష్టి నిను గన్గొనజాలనిదృష్టి నట్టిని
ష్కారణమైనగోష్టి కొర గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౧౮

ఉ. సత్యములేనివేల్పు సతి సౌఖ్యముదప్పినవల్పు మిత్రదాం
పత్యములేనిపొల్పు గడ బాధనజేయనితల్పు దేహికే
నిత్యముగానిబల్పు నిను నెమ్మదిదల్వనితల్పు ముక్తిసాం
గత్యములేనికొల్పు కొర గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౧౯

చ. ఎసయగ లేనిజాడు తన ♦ యిష్టముదప్పినకూడు మాటవా
శినిగన లేనిగోడు సతి ♦ శీలమెఱుంగనివానిజోడు స
జ్జనులకుజేయుకీడు నిను ♦ సన్నుతిసేయనివాడు వ్యర్థమో
వనజదళాక్ష దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౬౦

చ. చెలువము లేనికోక తన ♦ చేకొరమాలినరూక వానకుం
నిలువగరానిపాక యుసి ♦ నేస్తముజాలనిపోక మేనితో
నలరెడురాక నాపదల ♦ కక్కఱమాలినమూక వ్యర్థమో
జలజదళాక్ష యాగమని ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౬౧

చ. గరిసీయు లేనిసోము నిను ♦ గన్నులజూడనిమోము తానక
స్మరణము లేనిజాము తోలి ♦ జన్మమునోచనినోము చంద్రికల్
మెరయనిసోము డెన్న వెల ♦ మింగొరగాదు గదయ్య అయ్య భా
స్కరకులవార్ధిచంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౬౨

చ. పొడిపొడిసేయుముద నెలు ♦ పుక్కగనుపించనిసుద్ది రెంటిసం
దెడలినయద్ద భూపతి స ♦ హించని మిక్కిలిహద్ది మీఁదనా
దుడుకుసిపెద్ద దేవనిను ♦ యూకొనజాలనిగద్దె యేల పా
పడగను నేలవయ్య జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౬౩

ఉ. పాడియు లేనియాప్ర బుధ ♦ సద్గము జేరగ లేనితావు సిన్
గూడగ లేనిచాప్ర బ్రతి ♦ కూలతగల్గినచెగ్వ రేవు బల్
పోడిమిలేనిమాప్ర బలు ♦ పుంగసజాలనిలావు వమ్మనీ
వాడనుకాప్ర దుష్కృతని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౬౪

చ. పరుసము లేనికొండ పరి ♦ పాలన దప్పినబొండ నిత్యముల్
సిరిమరి లేనియొండె చెడి ♦ చిత్రముసుంగనిబండ మిక్కిలిన్

విరియఁగ లేనిదండ పది ♦ వేలుఘటింప నతండ దేల భా
స్కరకులవార్ధిచంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౧

చ. పదునుఁగ లేనికత్తి కడు ♦ బల్మియుజాలనిహత్తి నాయుధుల్
చెదరనితిత్తి యూతమగు ♦ చేతికిజాలనిసత్తి సౌఖ్యమే
యదననలేనివృత్తి భవ ♦ దంఘ్రులమోపనినెత్తి కీర్తియో
సదమలకీర్తిసాంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౨

చ. వరుసఁగ లేనికూర్పు నిను ♦ సన్నుతిసేయనినేర్పు మిక్కిలిన్
హరసములేనితీర్పు తన ♦ కాపదగూర్చెడువానిచేర్పు పెం
పరయఁగ లేనితార్పు మరి ♦ స్వప్నముసుమ్ము తలంచినారడ భా
స్కరకులవార్ధిచంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౩

చ. ఇదలినయూతపట్టు తన ♦ యింటనునిల్వనిగుట్టు దీపిగా
నొదువనిచుక్కబొట్టు తను ♦ నూనికెతిట్టినతిట్టు పద్యముల్
జదువనిభట్టు దేవనిను ♦ సన్నుతిచేయని నాముబ్రష్టయో
సదమలకీర్తిసాంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౪

ఉ. మేయుఁగ రానిపూరి పతి ♦ మేలునరించనినారి వంశగా
త్రోయనిభేరి వారిగణ ♦ ముల్ వెలిబారెడుదారి పుణ్యసం
శ్రేయములేనిదారి తన ♦ చేతనులేనికటారి యేల కం
జాయతపత్రనేత్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౫

చ. ముదముగ లేని చోద్యములు ♦ మూలముగాంచని భేద్యముల్ శుభ
ప్రదములు లేని వాద్యములు ♦ భక్తియు లేని నివేద్యముల్ సభన్
జదువనిపద్యముల్ బుడమి ♦ శాస్త్రవిహీనుని వైద్యముల్ వృథా
సదమలకీర్తిసాంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౘ౬

ఉ. నిక్కములేని సాక్షులును ♦ నిన్నుదలంపని భిక్షువుల్ గడున్
దిక్కనులేని కుక్షులును ♦ దీప్తివహించని చక్షులున్ వెసం
మక్కువలేని పక్షులును ♦ మానినిలేని విచక్షులేలయో
చక్కని కీర్తి సాంద్ర సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౧

ఉ. నీమములేని మంత్రములు ♦ నిష్ఠవహించని తంత్రముల్ జన
స్తోమములేని యంత్రములు ♦ సుస్థితిలేని స్వతంత్రముల్ వృథా
తామరసాయతాక్ష మద ♦ దానవ శిక్షవి నీలనీరద
శ్యామ గుణాభిరామ సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౨

చ. నిలువనిబొంకు భూపతుల ♦ నెయ్యముదప్పినమంకు శ్వేత సం
కులమును లేనిసంకు నను ♦ కూలముదప్పినరంకు మానసా
కులమును లేనిజంకు నిను ♦ గోరి భజింపకబొంకు వ్యర్థమో
జలజదళాక్ష యోగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౩

ఉ. మేరయులేనియాస సభ ♦ మెచ్చనివిద్యప్రయాస యగ్ని సం
స్కారములేనిపూస జన ♦ సమ్మతిదప్పినబాస చొక్కపుం
దారములేనిపూస సుకృ ♦ తంబుగచింపనిప్రాస మోసమో
వారిజనాభ దుష్కృత ని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౨౪

చ. నేరుగులేనిమొట్టు తన ♦ నేరమికోర్చినకొట్టు మాట వా
సెరుగనివావిలిట్టు సెల ♦ యేరులగట్టినగట్టు పాదముల్
నిరుపగలేనిపట్టు నిను ♦ నెమ్మది దల్వనిగుట్టు వ్యర్థముల్
సరసిజనాభ యోగమవి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౫

ఉ. తీరువలేని పత్రములు ♦ దీప్తివహించని నేత్రముల్ మహా
భారములేని గోత్రములు ♦ భద్రములేనిచరిత్రముల్ గడుం

నేరుపులేని సూత్రములు ♦ నీన్ గనజాలని క్షేత్రముల్ వృథా
వారిజనాభ మద్భక్తి ని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౨౬

ఉ. నాదము లేని యూక జన ♦ నంబు సహింపని మూక మక్కువల్
గూడని రాక నెమ్మదికి ♦ గోరిక జెందని పోక శబ్దముల్
పడగ లేని టీక విన ♦ వేడుక నొందని యాక మెంటిగా
నాడదు మేక యొందుకది ♦ వ్యర్థము ద్వారక వేంకటేశ్వరా. ౨౭

ఉ. చొక్కము లేని సత్యములు ♦ సొంపు కలంపని నృత్యముల్ గడుం
మక్కువ లేని భృత్యులు ♦ మన్ననకుంగని కృత్యముల్ వెసన్
దిక్కులు లేని పైత్యములు ♦ తీరులు మెచ్చని స్తుత్యముల్ వృథా
చక్కలు లేల యోగము వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౮

చ. పలుపురతోటి యల్క బలు ♦ పల్కులు బల్కని చిల్క నష్టి సం
కలితము లేని మొల్క షులు ♦ ఘుల్లని మ్రోయని గిల్క కంటిలో
మాలగెదు నట్టినల్క పుష ♦ మింగొరగా మగదయ్య అయ్యయో
జలజదళాక్ష యోగము వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౨౯

ఉ. పిత్తము లేని మోజు నిను ♦ వేడ్క భజింపని రోజు మిక్కిలిం
సత్తువ లేని రాజు దృఢ ♦ సత్వము లేని తరాజు చేతికిన్
గుత్తము లేని గాజు నృప ♦ కోటి నుతింపని తేజు మొత్తమై
కత్తులు లేని పౌజు కొర ♦ గామర ద్వారక వేంకటేశ్వరా. ౩౦

ఉ. గాజులు లేని చెయ్యి బహు ♦ గా జలమూరని నుయ్యి యూదిసం
రాజని పొయ్యి యింటి దరి ♦ రాగల నష్టము నొయ్యి నిత్యమున్
భోజన కాలమందు సరి ♦ పోని నెయ్యి నిరర్థకంబయా
రాజిత ద్వారకాపురి వి ♦ రాజిత ద్వారక వేంకటేశ్వరా. ౩౧

ఉ. మాసినచీరె రోత కొం ♦ మూలినమానిసిపేరె రోత తా
జేసినపోరె రోత నిను ♦ చింతనిసేయనినోరె రోత మే
ల్వాసినయూరె రోత చెడి ♦ పాసినపాళముతీరెరోత యా
భాసురకీర్తి మప్కృతని ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౭౨

ఉ. కాసులుగొన్న మోసమగు ♦ గాంతలగన్న ఘనంబు మోసమా
భాసలుగొన్న మోసమగు ♦ పాతలుగొన్న ఫణంబు మోసమా
రాసులుగొన్న మోసమగు ♦ రాజులుగొన్న ఘనంబు మోసమో
భాసురకీర్తిసాంద్ర అసు ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౭౩

ఉ. ముప్పునసప్పుచేటు ముది ♦ ముంపకు మొంపగుకొప్పుచేటు చా
చప్పనియుప్పుచేటు తిన ♦ సమ్మతిదప్పినచోటుచేటు తా
జెప్పినమప్పుచేటు సరి ♦ చేతను బాణముద్రిప్పచేటు యా
చప్పని మాటలేల సుపి ♦ చాలక ద్వారక వేంకటేశ్వరా. ౭౪

ఉ. కోపము సర్పజాతికిని ♦ రూపము మిక్కిలి విప్రజాతికిఁ
దాపము వేశ్యజాతికిని ♦ విత్తము నుత్తమ వైశ్యజాతికిఁ
ద్వేషము పాపజాతికిని ♦ దృష్టము మిక్కిలి నష్టజాతికిఁ
భాషలుమాకు మీకేలు ♦ బాగుగ ద్వారక వేంకటేశ్వరా. ౭౫

ఉ. పుంటికి నూనెమేలు సతి ♦ పుణ్యశరీరికి జ్ఞానిమేలు బ
ల్పంటికి కాచుమేలు చల ♦ పాదికి మిక్కిలి మాటమేలు స్త్రీ
చంటికికూనమేలు దగు ♦ సస్యము కెప్పుడు వానమేలు నీ
బంటును కావవయ్య జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౭౬

ఉ. లంజకుపిల్లచేటు పస ♦ రంసకు మిక్కిలి గుల్లచేటు కా
లుంజకు లొల్లచేటు బుషి ♦ కుంజరమాటకు గల్లచేటు బ

ల్పింజకు డొల్లుచేయు తన ♦ పేరునకొట్టిన కోట్లుచేటయా
కంజవిలోచనా భువన ♦ కారక ద్వారక వేంకటేశ్వరా. ౮౭

ఉ. సోగలులేని కన్నులును ♦ సొంపుకలంపని చన్నులున్ సదా
భాగులులేని పన్నులును ♦ పైరునవిత్తులులేని వెన్నులున్
త్యాగములేని [illegible]న్నులును ♦ న్యాయముదప్పిన తన్నులున్ దయా
సాగరవ్యర్థమయ్యె సుమి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౮౮

ఉ. క్రేపులులేనిగొల్ల బ్రతు ♦ కేమగు జాలని కొల్ల గోడపై
రూపములేనివెల్ల ధర ♦ లోజనులాడెడుకల్ల యెప్పుడున్
ఏపునులేనిపిల్ల బల ♦ మానునకబ్బినముల్ల మిక్కిలిన్
కాపునులేనిఖిల్ల కొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౮౯

చ. ఇలసరిలేనిమచ్చు తన ♦ మేలికకన్నను హెచ్చు వాసకుం
నిలువనిగచ్చు భూపతుల ♦ నెయ్యముదప్పినమెచ్చు ధైర్య సం
కలితముగానిముచ్చు కొర ♦ గాదుర సాధుజనైకమిత్ర యు
త్పలదళనేత్ర భక్త జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౯౦

ఉ. కట్టుడలేనిపుల్లె తన ♦ చేతనునిల్వనిముల్లె మిక్కిలిన్
దట్టముగానివల్లె సత ♦ తంబునుపూయని మల్లె రాజుచే
పట్టనిపల్లె దేవ భవ ♦ బంధవిమోచన వ్యర్థమయ్యె చే
పట్టుమునన్ను సుప్రకృత ని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౯౧

ఉ. అన్నములేని ప్రాణములు ♦ సత్థముగాని పురాణముల్ సదా
జన్నములేని కోణములు ♦ సత్యములేని ప్రమాణముల్ తుదన్
సన్నములేని ఘ్రాణములు ♦ సాధ్యముసేయని బాణమేలయా
పన్నశరణ్యగణ్య జన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా ౯౨

ఉ. నేరములేనిశిక్ష తన ♦ నేర్పువహించనిరక్ష దేవ భం
డారముపైనపేక్ష జగ ♦ డానకులోనగుభిక్ష యగ్నిసం
స్కారములేనిదీక్ష కడ ♦ కందుదిముట్టనికక్ష వ్యగ్రమో
వారిరుహాక్ష దుష్కృత ని ♦ వారక ద్వారక వేంకటేశ్వరా. ౯౩

ఉ. మూలికిలేనితిప్ప కను ♦ మోడ్పువహించనిరెప్ప నీటిపై
దేలనితెప్ప మేలు జగ ♦ తింపిలశిల్లని గొప్ప జంటగా
బాలికలేనియప్ప ధర ♦ పాలగులప్ప నిరర్థకంబయా
బాలముకుంద భక్తజన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౯౪

ఉ. సానికిమెప్పులేదు సర ♦ సానకు నెంచునరిప్పలేదు శా
స్త్రానకు దప్పులేదు దొర ♦ సానికి నెప్పుడు చొప్పులేదు స
న్న్యానికినప్పులేదు కరు ♦ ణారసపూరి విహారభక్తర
క్షానిపుణుండ యోగమ వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౯౫

ఉ. స్త్రీలకుకొప్పురూపు కురు ♦ చేలకుదంతపుకప్పురూపు దం
తాలకు కప్పురూపు పర ♦ దాలకుగోడలచొప్పురూపు శా
స్త్రాలకుమెప్పురూపు గుణ ♦ సాగరసాధుజనైకబృంద గో
పాలముకుంద భక్తజన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౯౬

చ. ప్రణవములేని నాదమును ♦ బల్మియులేని వివాదముల్ లస
త్ఫణితియులేని వేదము శు ♦ భంబులులేని ప్రమోదముల్ మహా
ఫణములులేనిజూదము ప్ర ♦ పన్నతలేనిప్రసాదమేల యో
ప్రణుతసురేంద్రభక్తజన ♦ పాలక ద్వారక వేంకటేశ్వరా. ౯౭

చ. కొలకును రానికుంచమును ♦ కుడ్వగజాలని యట్టికించముల్
పలువురిచేతి లంచమును ♦ పండగజాలని యట్టిమంచముల్

దెలియని యీప్రపంచమును ♦ నీనిధికిం గొరగాదుయయ్యయో
జలజదళాక్ష యోగమ వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౯౮

ఉ. కప్పకుగంతులెన్న తన ♦ కాన్పుకు మిక్కిలి సంతులెన్న పా
తప్పకురంతులెన్న నెల ♦ యాండ్రకుజొప్పగుతంతులెన్న వా
తప్పకు వంతులెన్న తన ♦ తప్పకు మిక్కిలిగొంతులెన్నయా
చప్పనిమాటలేల సువి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౯౯

ఉ. గందములేల గాడిదకు ♦ గంపెడుబూడిదగాక యత్తరుల్
పందికినేల మిక్కుటపు ♦ పంకమెగాక దివాంధపక్షికిన్
గొందియెగాకనేల వెలు ♦ గుల్ చెడువానికిసత్కథాసుధల్
మందసుఖంబులేల చెడు ♦ మార్గమెగాకిల వేంకటేశ్వరా. ౧౦౦

చ. మిరియములేనికూర యును ♦ మెచ్చులెరుంగని వారియీవియున్
గరగరగానిభోజనము ♦ కన్నులపండువుగాని రూపమున్
మురిపెములేని యౌవనము ♦ మోహములేని లతాంగికూటమిన్
సరసులకింపుగావు జల ♦ జాక్షుడ ద్వారక వేంకటేశ్వరా. ౧౦౧

ఉ. మచ్చికలేనిచోట నను ♦ మానమువచ్చిన చోట మెండుగా
గుచ్చితులున్నచోట గుణ ♦ కోవిదులుండనిచోట విద్యలన్
మెచ్చనిచోట రాజు గరు ♦ ణించనిచోట వివేకులుందురో
అచ్చట మోసమంద్రు సుగు ♦ ణాకర ద్వారక వేంకటేశ్వరా. ౧౦౨

చ. ఎనయగనేనుదంట జల ♦ మింతయునిల్వనిపాడుగుంట నీ
చునకుబదార్థముంట తను ♦ జూచిసహింపని యూరనుంట లే
గనియెనుచేనిపంట వెస ♦ నాకటి కందనివంట మంట కా
జనకసుతాభిరామ బుధ ♦ సన్నుత ద్వారక వేంకటేశ్వరా. ౧౦౩

చ. పిలువనికూటికిం జెతల ♦ బెట్టుధరావరు డేలుపేటికిన్
జలములు లేని యేటికిని ♦ సారెకుబంధువులున్న చోటికిన్
పలువురితోటిపోటికి నృ ♦ పాలురసాటికి బోవరాదయా
జలజదళాక్షయోగమ వి ♦ చారక ద్వారక వేంకటేశ్వరా. ౧౦౪

ఉ. తంత్రులు లేనివీణయు ని ♦ దానము రాగము లేని గీతముల్
మంత్రులు లేని రాజ్యము స ♦ మానము లేనటువంటి వియ్యమున్
మంత్రము లేని సంధ్యయును ♦ స్నానము లేని తపంబు వేద వి
స్వంత్రము లేని యాగము వృ ♦ థాకద ద్వారక వేంకటేశ్వరా. ౧౦౫

ఉ. వాసన లేనిపువ్వు బుధ ♦ వర్గము లేనిపురంబు భక్తి వి
శ్వాసము లేనిభార్య గుణ ♦ వంతుడుగాని కుమారుడున్ సదా
భ్యాసము లేనివిద్య పరి ♦ హాసము లేని ప్రసంగవాక్యముల్
గ్రాసము లేనికొల్వు కొర ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౧౦౬

ఉ. అంగన లేనియిల్లు చతు ♦ రంగబలంబులు లేనిరాజు ని
స్సంగుడుగానిసాని జన ♦ సమ్మతి లేని ప్రధాని పొత్తుగా
బంగరు లేని రత్నమును ♦ భాగ్యము లేని నరుండు స్త్రీలకుం
ముంగర లేని భూషణము ♦ మోదమ ద్వారక వేంకటేశ్వరా. ౧౦౭

చ. వినయము లేని విద్యయు వి ♦ వేకము చాలని దేశికత్వముల్
సనయుడుగాని పండితుడు ♦ సౌఖ్యమునీయగ లేని గానముల్
కనుగవకింపుగాని సతి ♦ గాంచగ నేవము బుట్టుగెలియున్
గనికరమూన లేని మది ♦ గాదుర ద్వారక వేంకటేశ్వరా. ౧౦౮

ఉ. అంబువులేనియూరు మది ♦ యందునదేకువలేనిపోరు చ
క్రంబులులేనితేరు ధన ♦ రాసులులేని కొఠారు మంచి వ
ర్షంబులులేనిపైరు రుచి ♦ జాలకనుండెనుచారు నీదు నా
మంబనలేనినోరు ధర ♦ వ్యర్థము ద్వారక వేంకటేశ్వరా (౧౦౯

ద్వారక వేంకటేశ్వరశతకము సంపూర్ణము.

ఇది నియోగులు, కాస్యపగోత్రులు, కామయామాత్మజులునగు
నరసింహ కవిగారిచే రచియింపఁబడి, కృష్ణాజిల్లా
యేలూరు కొండగుంటువారి నాగభూషణము
గారిచేఁ బ్రకటింపఁబడియె.

మంగళంమహా.

శ్రీశ్రీశ్రీ
శ్రీ.



# ప్రకటనపత్రిక.



కోటిఫలి । సిద్ధిజనార్దన పాపమర్దనా॥ యను మకుటముగల శతకమెవ్వరైనను నాకంపినచో నీశతకమును వెంటనే యచ్చువేయించి ప్రచురింపఁ జేసెదను.

పై శతకమందలి పద్యములు నాకులభించిన నాలుగు
పద్యము లిందచ్చొత్తించినాఁడను.

చ. పికములు లేనితోట కరి ♦ బృందవిహారము లేనికోట బల్
సుకవులు లేనిపేట శ్రుతి ♦ సొంపు గణింపగరానిపాట డాం
బికమతినాడుమాట నిను ♦ మేటిభజింపనిపూట రిత్తనై
చ్చికబహునాట కోటిఫలి ♦ సిద్ధిజనార్దనపాపమర్దనా. ౧

చ. ఫలములు లేనిచెట్టు వర ♦ పాదపషండము లేనిగట్టు ని
శ్చలమతిగానియొట్టు నవి ♦ చారముగా శపియించుతిట్టు ని
ర్మలమతిదావకీన గృహ ♦ మార్గముమెట్టని మెట్టు వ్యర్థమో
చెలువలపట్టు కోటిఫలి ♦ సిద్ధిజనార్దన పాపమర్దనా. ౨

చ. సరిరుచిలేనివంట నవ ♦ సారసషండము లేనిగుంట ఘ్రాం
కరణము లేనిగంట పలు ♦ గాకులపాలై స్వానుభూతికై
బెరుగనిచేనిపంట మిము ♦ బేర్కొని మ్రొక్కనిచేయిదంట చె
చ్చెరవృక్షలంట గోటి ఫలి ♦ సిద్ధి జనార్దన పాపమర్దనా ౩

ఉ. రచ్చకురానిపంద రుచి ♦ రంబుగ గోపతి లేనిమంద వే
హెచ్చుగ సర్వసస్యములు ♦ యేపునబండని యూటబంద సూ
నిచ్చలుపూజసల్పి నిను ♦ నేర్పునగొల్వనిమేను బొంద యా
చెచ్చెరడింద కోటిఫలి ♦ సిద్ధిజనార్దన పాపమర్దనా. ౪

